సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 32 సంచిక 11

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

ఫిబ్రవరి 1944

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రాప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్:— గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 32 | ఏలూరు, 15 ఫిబ్రవరి | సంచిక 11 |
| --- | --- | --- |




## నిత్యసంకీర్తనము

**వివరణము :**

మనము భగవంతునిమఱచి ప్రపంచ వ్యామోహమునఁ జిక్కుకొంటిమా జ్యోతిర్దర్శనమంతరించును. అపుడన్నియు మన కవస్థలే సంభవించును. ఇదంతయు మనకు వినయము చేకూరువఱకే, స్వార్థపరుఁడు నశించియేపోవును. అంతకన్న గొప్ప బుద్ధిగలవాఁడు, పరోపకారి, యాతనిస్థల మాక్రమించును. ఇది సృష్టిధర్మము. పరోపకారియే సర్వప్రపంచమునకుఁ బూజనీయుఁడు.

**సంకీర్తనము :**

1. ప్రభూ! పదార్థము లన్నింటిలో గల సత్యము నెఱుంగు విజ్ఞానమును నాకు దయచేయుము.
2. నా మనస్సులోని అజ్ఞానమును నశింపఁజేయుము.
3. స్వార్థమును, అహంకారమును నా హృదయమునుండి పాఱద్రోలుము.
4. హే విశ్వమూర్తీ! మన యిరువురి నడుమనుండు తెరను దొలగించి నాకు నీ దివ్యసాక్షాత్కార మనుగ్రహింపుము.

—స్వామి రామతీర్థ.

# భగవన్నుతి

కల్లూరు అహోబలరావు

(వెనుకటిసంచిక తరువాయి)

సీ. మృగనాభిలోపల, మేలికస్తురిఁ బెట్టి । యిమ్ముగా దాని వధింపనేల ?
గోరోజనంబును గోనాభిలోఁ బెట్టి । చెనఁటివై దాని హింసింపనేల ?
మువ్వన్నె మెకముపై మూడువన్నెలతోలు । గప్పి ప్రాణముల బోకార్పనేల ?
పట్టుపురుగునందు పట్టుఁ బెట్టియు దాని । కట్టడివై మట్టుబెట్టనేల ?
గీ. చిత్రమైన వర్ణంబులు చిలుక కొసఁగి । ఇంపుగా పంజరమున బంధింపనేల ?
నీ రహస్యంబు నెవరు వర్ణింపఁగలరు । భక్తమందార ! నీకిదే వందనంబు.

సీ. కోకిల కింపైన కూజితంబును బెట్టి । నల్లని రంగేల జల్లినావు ?
గేదగీపుష్పంబులో దివ్యమౌ సౌర । భము బెట్టి ముండ్లేల పఱచినావు ?
చుక్కలదొర నెంతో చక్కగా సృష్టించి । గట్టిమచ్చ నదేలఁ బెట్టినావు ?
సాంద్రంబునకు మహాసత్త్వంబుఁ జేకూర్చి । జలముల నుప్పేల గలిపినావు ?
గీ. ధీ బలం బిచ్చి కవులకు దీరరాని । పేదఱిక మేలనొసగితి వాదరమున ?
నీ రహస్యంబు నెవరు వర్ణింపగలరు ? । భక్తమందార ! నీకిదే వందనంబు.

సీ. కడుపునిండఁగఁగూడు గనలేని పేదల । సంతానభరముచేఁ జంపనేల ?
సిరి మూల్గి పడియున్న శ్రీమంతు లిండ్లలో । పిల్లల లేమిని బెట్టనేల ?
సాధుసజ్జనులకే సంకటంబులఁ గూర్చి । నిత్యంబు వారిఁ గుందింపనేల ?
కపటులై చెనటులై కఠినాత్ము లగువారి । కానందసౌఖ్యంబు లబ్బుటేల ?
గీ. రంగుగాఁ జూడ బంగారు రంగుమాఱి । కాకిబంగారు శృంగారకంబు లయ్యె !
నీరహస్యంబు నెవరు వర్ణింపఁ గలరు ? । భక్తమందార ! నీకిదే వందనంబు !

సీ. క్షీరంబులోనున్న నీరంబుఁ బోద్రోలి । యమృతంబుఁ గ్రోలు రాయంచనేర్పు
నిండుజాబిల్లి వెన్నెలతీపి గ్రహియించి । భుజించు వెన్నెలపులుగునేర్పు
శ్రీరామనామంబు గారాబమున నేర్చి । పలుకుచుఁ బలికెడి చిలుకనేర్పు
ప్రియులకుఁబ్రియురాండ్ర ప్రేమసందేశముల్ । త్వరగఁగొంపోవు పావురమునేర్పు
గీ. అన్ని నేర్పులు నీయందె యున్నవయ్య ! । నేర్పులకు నేర్పరివినీవు నీరజాక్ష !
కొన్నినేర్పుల మము బ్రోచికొనుము వేగ । భక్తమందార ! నీకిదే వందనంబు.

---

# శ్రీ రామ సు తి

వేమూరి కుటుంబశర్మ - పెదరామ భద్రపురము

క. శ్రీరామా ! పురుషోత్తమ ! నారాయణ ! దేవదేవ ! నళినాక్షహరీ !
ఘోరకులాభరణా ! మము, కారుణ్యముతోడ వేగ గావుము రామా !

క. హరవిధినుత ! నీనామము, నిరతంబును దప్పకుండ నియమముతోడన్
స్మరియింపఁ దొల్లి చేసిన, దురితసమూహంబు లన్ని దొలగును రామా!
క. ఎక్కటిదైవంబగు నీ, చక్కని రూపంబుఁ జూడ స్వాంతమునందున్
పెక్కుదినంబుల నుండియు, నిక్కముగా వేఁచుంటి నిజముగ రామా!
క. సనకాదిమునీంద్రులకె నీ, ఘనతరరూపంబు జూడఁగా నేరనిచో
మనుజుఁడ నసమర్థుఁడ నే, కనుఁగొన జాలుదునె దేవ కరుణాకరరామా!
క. శ్రీజానకీ మనోహర ! రాజీవదళాక్ష ! నిఖిలరాజస్తుత్యా !
రాజధరవినుతనామా ! భూజనమందార ! మమ్ము బ్రోవుము రామా!
ఉ. నమ్మితి రామ నీదుచరణంబులె దిక్కని స్వాంతమందు నే
నమ్మఁగ లే దశాశ్వతధనంబును దేహము నాత్మవర్గమున్,
ఇమ్ముగ నీభవార్ణవము నెట్టులొ దాటఁగఁజేసి నాకు నీ
యిమ్ము నొసంగి బ్రోవుము మునీశ్వర భక్తజనైకరక్షణా!
శా. రమ్మా రాఘవ ! జాగుసేయ కిఁక నీరాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచి యీ చందాన నున్నాఁడ నో
యమ్మా సీత భవత్కుమారు ఁడను నాయారాటమున్ బాపవే
పొమ్మా యంచును జెప్పి పంపుము దయన్ పూఁబోఁడి నీనాథునిన్.

---

# క్రమశిక్షణ

(కల్లూరు అహోబలరావు)

మాదిరి:—తోటమాలిరాముడెంత పాటుపడునుచూడరా

తోహర:—

1. ఇంట తల్లిదండ్రులకును హితముగాగ మెలగుచున్
గంట కొట్టగానె బడికి క్రమముమీఱ వెడలుమా
2. బడినిఁ జేరగానె తోటి బాలకులను ప్రేమతో
కడు ముదంబుతోడఁ గాంచి గౌరవింప నేర్వుమా
3. పంతులయ్య వచ్చినంత భక్తితోడ నిల్వుమా
సంతసమునఁ బ్రార్థనంబు సల్పి మోద మందుమా,
4. అల్లరేమిఁ జేయ కీవు హర్ష మలర పాఠముల్
ఉల్లమందు బాగ నేర్చి యోర్పుఁగల్గి మెలగుమా
5. తోడిబాలకులకు నీవు తొందరేమి సేయకన్
పాడిఁ దెలిసి సాయములను బరగఁ జేయుచుండుమా —

6. గురువులన్న భక్తిఁగల్గి కూర్మిమీఱ మెలఁగుమా
గురువు నాదరమునఁ జూచి కోపపడక నుండుమా -
8. గురువు చెప్పుపనుల నెల్ల కడుభక్తిఁ జేయుమా
గురులసేవ సల్పకున్న । కూడిరావు సౌఖ్యముల్ -
8. గురువు లొక్కవేళ శిక్ష । కోపపడి యొసంగినన్
పరమభిక్ష యంచు దాని । భావమందుఁ దలపుమా -
9. శిక్షలేక విద్యరాదు । రక్షణంబు లేదురా
శిక్షవిద్య లక్ష్యలౌనఁగి । అక్షయంబు సల్పురా -
10. వినయమలర మాటలాడి । విద్యలెల్ల నేర్వుమా
మనమునందు భయముగల్గి । మంచిమాట లాడుమా -
11. పెద్దలన్న భక్తిఁగల్గి । ప్రియముమీఱ మెలఁగుమా
సుద్దులెల్లఁ జెప్ప మాని । పోకులెల్ల వీడుమా -
12. బీడి సిగరేట్లఁ గాల్చి । కీడుసెందఁ బోకుమా
చాడిమాట లెల్లఁ జెప్పి । జగడములకుఁ బోకుమా -
13. చెడ్డవారి పొందు సలిపి । చింతసేయ వలదురా
దుడ్డుఁబెట్టి యాటలాడ । దుఃఖమందు నిజమురా -
14. ఆటపాటలందు కూడ । హర్షమలర మెలఁగురా
తోటవనుల శ్రద్ధతోడ । నీటుగాగ సల్పురా -
15. ఇట్టిదా "క్రమంపుశిక్ష" । హిత మొసంగి బ్రోచురా
మట్టుమాన్యతలను దెల్పి । మనుచు సతము దెలియురా -
16. శిక్షణం బటన్న యిదియె । శిక్షణంబు తెలియురా
శిక్షవిద్య లక్షలౌనఁగి । అక్షయంబు సల్పురా॥

---

## బాలనీతి

### చిలకా వేంకటకృష్ణదాసు

తే. గీ. ఒరుల యధికత కొక్కింత యోర్వలేక లేనిగొప్పలు ప్రకటింప బూనుదేని
ముప్పువాటిల్లు ననియెడి బోధ మెరిగి శక్తికొలది మెలంగుము సతము బాల !
తే. గీ. పాదపములకు వాయువు పద్మములకు శిశిరము గిరులకు పవి, మూషికములకు బి
డాలము వలె సాధులకు దుశ్శీలపాళి వలన భయము ఘటిల్లును వసుధ, బాల !
తే. గీ. జూలు కట్టుకొన్నంత మార్జాలము భువి కేసరియటంచు గాంచునె వాసి? యట్లె
విద్యలేకయె వేషముల్ వేయునరుడు పండితుం డని పిల్వంగఁబడునె? బాల !
తే. గీ. ఆపదలయందు మిత్రుల నాహవమున శూరు సంపత్క్షయంబున దార, వ్యసన
సమయమందు బాంధవులగుణము నెరిగి వివేకవంతుడు వర్తించు వినుముబాల !

తే. గీ. దైవ గురు శిశు భూప విద్వాంసుల సరి కరుగునపు డెన్నడును రి క్తకరముతోడ జనుట యోగ్యముకాదను శాస్త్రప్పునుడి భావమందుంచి వర్తింపవలయు బాల
తే. గీ. స్వార్థపరతను విడనాడి యన్యుల దుర వస్థ వారింపగ సహాయపడుట సుజన విధి యగుట దాని బూనినవిధిగ నీవు సద్యశంబు నార్జింతువు సతము బాల!
తే. గీ. హస్తము వదాన్యతను, కర్ణ మతులశాస్త్రమున, శరీరము దేశసేవను, ప్రకాశ మొందు, హస్తకర్ణాభరణోత్సుగంధ ములను దీప్తిని బొందవు పుడమి బాల!

# విద్యాప్రచారపు పాట

రచయిత :— నాగవోలు వెంకట అప్పారావు.

[ "దేవదేవా కావవేమము దేవరా సుగుణాకరా" వలె.]

బాలకా! నీకేలకో? బడి - పంతులంటె భయంపడ
చాలుచాలును లోలనయనా! సరగునను పరుగెత్తుమా॥ బా॥
బడికి వేళకు తడయకను జను - బాలబాలుర ప్రోచినా
విడియమందిన వాడ్వివలె - బడి పంతు లానందించురా!॥ బా॥
విద్యతరుగనివిత్తమూ మరి - విద్య మూడవనేత్రమూ
విద్య బంధు విదేశమందున - విద్య నరునకు ఛత్రమూ॥ బా॥
విద్య సుందరరూపదాయిని - విద్య భోగవిధాయినీ
విద్య భోగకరీ నిజమురా - విద్య నిసుఖకారిణీ॥ బా॥
ధనము దొంగలు దోచుకొనుటకు - దారియిచ్చును జోరుగా
ఘనము విద్యాధనము దొంగల - గడపజేరదు జూడరా!॥ బా॥
ధనము ధర్మముజేయుచుండగ - తగ్గుచుండును గాని యీ
ధనము విద్యాదానమందున - దొంతుదొంతులు హెచ్చురా॥ బా॥
విద్యవలన వినమ్రతమబ్బును - వినయమే కడు నయమురా
వినయవంతుని వినమ్రతకే - విశ్వమంతయు మ్రొక్కురా॥ బా॥
వినయముననే విస్తరించును - వింతవింతగ పాత్రత
వినమ్రతనే గౌరవింతురు - విశ్వమానవపాత్రులు॥ బా॥
పాత్రతబ్బిన భాగ్యమబ్బును - పొలముకొలదీ పంటరా
ఆత్రమొందుచు అధికమగు తన - బుద్ధికొలదీ సుఖమురా॥ బా॥
ధనముగలినవానికే - దాసోహమ్మనులోకమూ
ధనముగల్గిన నాటనుండియె - దానధర్మము చేయుము॥ బా॥
ధర్మకర్మన నైహికంబున - దాసియగు సుఖదేవతా
మర్మమేలను పారలౌకిక - మహిమ దేవునిబాధ్యతా॥ బా॥

రాజు జగమున పూజ్యుడూ - పరరాజ్యమందున త్యాజ్యుడూ
కాని విద్యారాజు కాగల - ఖండాంతరపూజ్యుడూ॥ బా॥
ధన మసత్యము ధన మనిత్యము - ధనము చంచలచిత్తినీ
మనకు విద్యాధనము సత్యము - గొరుగుకోర్కులకామినీ॥ బా॥
దేవుడంటే ఏవగించే - దద్దమ్మొక పశువురా
బడికిరానీ చదువురానీ - పశువు రెండవపశువురా॥ బా॥

(పశేషము)

---

## ఐరోపా—ముఖ్యపట్టణములు

### వేదుల నరసింహము, బూర్జ.

(గతసంచిక తరువాయి)

16. బర్స్లెం } .—ఈ రెండు పట్టణములు ఇంగ్లండులో పింగాణీ పరిశ్రమకు
17. స్టోక్ } కేంద్రస్థానములు. ఈ పరిశ్రమకు కావలసిన మట్టి కారన్ వాల్ మిట్టలందు దొరకను. దానిని లివరుపూర్ రేవుమీదుగ తెచ్చికొందురు.

18. లండన్‌నగరము:—ఇది థేమ్సునదీ ముఖద్వారమున నున్నది. బ్రిటిషు సామ్రాజ్యమునకు రాజధానీనగరము. ప్రపంచములో వర్తకమునకు ప్రసిద్ధిచెందిన పట్టణము ఇది రేవుపట్టణము. ఇచ్చట గణిత, రసాయనిక, వైద్యసంబంధమైన పరికరములు, ఇనుము, ఉక్కుసామానులు, చేయుయంత్రశాలలు గలవు.

19. పారిస్‌నగరము.—ఇది సేన్‌నదిమీద నున్నది. ఫ్రాంసుదేశమునకు రాజధానీనగరము ఇది జరీనేతకు నగిషీపనులకు ఆభరణములకు పట్టుపరిశ్రమకు ప్రసిద్ధి చెందియున్నది. ఇది లలితకళలకు పుట్టినిల్లు.

20. బెర్లిన్:—ఇది జర్మనీదేశమునకు రాజధాని. ఇచ్చట ఎలెక్ట్రిక్ సామానులు, రసాయనిక వస్తువులు తయారుచేయుదురు.

21. మాస్కో:—ఇది రష్యాదేశపు రాజధాని. ఇది రైలుకూడలిస్థలము. నేత పరిశ్రమకు ప్రసిద్ధిజెందినది.

22. రోమ్‌నగరము:—ఇది ఇటలీదేశమునకు రాజధాని. ఇది ఏడుకొండలమీద కట్టబడెను. ఇచ్చటగల సెంటుపీటర్సు చర్చి ప్రపంచములో చాలగొప్పది.

## ఐరోపా ముఖ్యవిషయములు

ఐరోపాఖండ తీరరేఖ చీలియుండుటవలన లాభములు —

I. మంచి నౌకాశ్రయములు ఏర్పడును. II. విదేశవ్యాపారము వృద్ధిపొందును. III. దేశీయులు మంచినావికులగుటకు అవకాశముండును. IV. సముద్రము భూమిలోపలకు చొచ్చుకొనియుండుట వలన శీతోష్ణస్థితి సమముగానుండును.

తూర్పు ఐరోపాయందు శీతలబాధ యధికము ఎందుచేత?

1. తూర్పు ఐరోపా సముద్రమునకు దూరముననున్నది. అందుచేత సముద్ర ప్రభావము శీతోష్ణస్థితిని మార్చ లేదు. II ఆర్కిటిక్ తీరమునుండివచ్చు శీతలగాడ్పులు ఆపుటకు తగిన పర్వతపంక్తులు దేశములో లేవు. III. ఈ భాగము మధ్యఆశియాలోని శీతలప్రదేశము నానుకొనియున్నది

వాయవ్య ఐరోపా వాసయోగ్యము ఎందుచేత?

ఈ దేశపుతీరరేఖ చీలియుండి సముద్రము భూమిలోనికి చొచ్చుకొని యుండుట చేత వేసవికాలమున ఈ ప్రదేశము చల్లగనుండును. II గల్ఫుస్ట్రీము అను ఉష్ణప్రవాహము అట్లాంటిక్ మహాసముద్రమునుండి వచ్చుటచేత ఈ ప్రాంతము శీతకాలమున సమశీతలముగనుండును III నైరృతీ వ్యాపార పవనములవలన ఈభాగమున కధిక వర్షము కురియును. ఈకారణములవలన ఈభాగములో అధికవర్షములు ఎక్కువ. ఓడరేవులు, గలిగియున్నవి. అందుచేత ఇదివాసయోగ్యమైన ప్రదేశము.

మాన్‌చెష్టరు ప్రపంచములో నూలిపరిశ్రమకు ప్రసిద్ధి - ఎందుచేత?

1 ఈప్రాంతమున బొగ్గుగనులు ఎక్కువగలవు.

II ఇచ్చట మంచినీరు లభ్యమగును III ఈ మండలమునగల తేమగాలి ఈ పరిశ్రమకు తోడ్పడుచున్నది IV ప్రత్తిని సప్లయిచేయు అమెరికా సంయుక్త రాష్ట్రములకు సమీపముననున్నది. V సరకుల ఎగుమతులు దిగుమతులకు తగిన వ్యాపార సౌకర్యములుగలవు. VI. గల్ఫ్‌స్ట్రీము అను ఉష్ణప్రవాహము బ్రిటిషు దీవులయొక్క పడమటిదీరమునకు సోకుటచేత శీతకాలములోకూడ వ్యాపారముజరుగును.

III. కర్మాగారములలో పనిచేయుటకు నేర్పుగలపనివారు అధికముగ దొరకుదురు.

## ఉత్తర అమెరికా - ముఖ్యపట్టణములు

1. క్విబెక్:—ఇది కెనడా దేశములో సెంటులారెన్సు నదియొడ్డున నొకకొండపై గలదు. ఇది కలప పరిశ్రమకు తోలుపనులకు, ప్రశిద్ధికెక్కిన పట్టణము.

2 ఒట్టావా:—ఇది సెంటులారెన్సు నదియొడ్డునున్నది. ఇది కెనడా దేశపు రాజధానినగరము. ఇది కలపపరిశ్రమకు, వెన్న, జున్ను పరిశ్రమకు, కాగితపుగుజ్జు తయారు చేయుటకు, ప్రసిద్ధిజెందినది.

3. వాంకోవార్.—కెనడాలో పడమటితీరమున గల రేవుపట్టణము. కలప పరిశ్రమకు, గోధుమవ్యాపారమునకు, ప్రసిద్ధిజెందినది.

4. మాంట్రియల్—ఇదిగొప్పజంక్షను వర్తకస్థానము. ఇచ్చట ఇనుప సామానులు, పట్టువస్త్రములు, ఫెంజి, పొగచుట్టలు, తయారుచేయు యంత్రశాలలు గలవు. ఇచ్చట వెన్న, జున్ను, పరిశ్రమకూడ ఎక్కువగా జరుగుచున్నది. గోధుమవ్యాపారమునకు ప్రపంచములోకెల్ల ప్రసిద్ధిచెందిన పట్టణము.

5. విన్నిపెగ్:—ఇది కెనడాలో అరణ్యప్రదేశములకు, ప్రయిరీభూములకు, మధ్యనున్నది. అందుచేత కలపపరిశ్రమకు, గోధుమఎగుమతికి ప్రసిద్ధి. ఇచ్చట వెన్న, జున్ను, కాగితపు పరిశ్రమలు, కూడ జరుగుచున్నవి.

6. లాజ్ఏంజల్సు:—ఇది అమెరికా సంయుక్తరాష్ట్రములలో పడమటితీరమున గల పట్టణము. ఆరోగ్యవంతమైనది. ఇచటి ప్రకృతిసౌందర్యము చాల మనోహరముగనుండును. ఇది సినీమాఫిలిములను తయారుచేయు పరిశ్రమకు ప్రసిద్ధి. దీనిసమీపమున పెట్రోలియము దొరకును.

7. పోర్టులెండు:—ఇది ఒరిగాన్ రాష్ట్రమునకు రేవుపట్టణము. ఇచ్చటనుండి కలప, పండ్లు, సామన్‌చేపలు, విదేశములకు పంపబడును.

8. సాక్రిమెంటో.—ఇది కాలిఫోర్నియా రాష్ట్రమునకు రాజధానీనగరము.

9. శాన్‌ఫ్రాన్సిస్కో:—ఇది కాలిఫోర్నియాదేశపు రేవుపట్టణము. ఇచ్చట చక్కని నౌకాశ్రయముగలదు. ఇచ్చట పండ్లపరిశ్రమ ఎక్కువగనున్నది.

10. డిట్రోయిట్:—ఇది ప్రసిద్ధిజెందిన ఫోర్డు మోటారు కంపెనీవారికి ప్రధానస్థానము.

11. షికాగో:—సంయుక్తరాష్ట్రములలో నిది రెండవ ముఖ్యనగరము. గొప్ప రైలు కూడలిస్థలము. ఇచ్చట వ్యవసాయపు పనిముట్లు, ఇనుపసామానులు తయారుచేయుదురు. ఇది మాంసపు ఎగుమతికి ప్రసిద్ధిజెందినది.

12. సెంటులూయీ:—ఇది పొగాకుపండు ప్రదేశమునకు మధ్యనున్నది. ఇచ్చట పొగచుట్టల పరిశ్రమ విరివిగ జరుగుచున్నది. తోళ్లపరిశ్రమకూడ జరుగుచున్నది.

13. ఫిలడల్ఫియా:—ఇచ్చట ఇండ్లు సుందరముగను, విశాలముగ నుండును. నౌకానిర్మాణము, యంత్రములు తయారుచేయుట, ఇచటి ముఖ్యపరిశ్రమలు.

14. వాషింగ్‌టన్:—ఇది సుందరమైన నగరము. సంయుక్తరాష్ట్రముల మొదటి ప్రసిడెంటుపేరున ఇది పిలువబడుచున్నది.

15. బాల్టిమోరు:—ఇది నూలువస్త్రములకును, ఇనుపసామానులకును, పేరు పొందినది.

16. బోస్టన్:—అమెరికాఖండములోకెల్ల ఈ పట్టణము ఉన్నిపరిశ్రమకు ప్రసిద్ధి జెందియున్నది. కాగితములు, తోలు, లోహపు పరిశ్రమలుగూడ జరుగుచున్నవి.

17. పిట్సుబర్గు:—సుపీరియరు సరస్సు సమీపమున దొరకు ఇనుముతో ఇచ్చట ఇనుపసామానులు, యంత్రములు తయారుచేయుచున్నారు.

18. న్యూయార్కు:—ఇది ఉత్తర అమెరికా ఖండములో గొప్పనగరములలో మొదటిది. ఇది మంచి రేవుపట్టణము. ఇచ్చట ఇనుము, ప్రత్తి పరిశ్రమలు విరివిగ జరుగుచున్నవి. ఇది నీటిదారులకు, రైలుమార్గములకు గొప్ప కూడలిస్థలము.

19. క్లీవ్‌లాండు:—ఇది ఈరే సరస్సుమీద నున్నది. ఇనుము, ఉక్కు సామానులకు ప్రసిద్ధిజెందినది.

20. బర్మింగుహోము:—ఇచ్చట ఇనుప కార్ఖానాలు గలవు. ఈ పట్టణము బట్టల నేతకు ప్రసిద్ధి పొందినది.

## ఇ త ర వి ష య ము లు .

మెక్సికో:—మెక్సికో దేశములో పశుపాలనము ముఖ్యవృత్తి. అరణ్యములందు రబ్బరు, మహోగని వృక్షములు, పల్లపుభూములలో పొగాకు, వరి, చెఱకు, గోధుమ పండును. ఇచ్చట వెండి, బంగారము, రాగి, సీసము, పెట్రోలు దొరకును. ఈ దేశమునకు ప్రధాననగరము మెక్సికో.

స్కై-స్క్రే-పర్లు:—న్యూయార్కు పట్టణపు వైశాల్యము తక్కువ. జనసంఖ్య హెచ్చు. అందుచేత ఇచ్చటి భవనములు చాల అంతస్థులు గలిగియుండును. దీనిని 'స్కై-స్క్రే-పర్లు' అందురు.

న్యూఫౌండులాండునందు చేపల వేట ముఖ్యవృత్తి. ఎందుచేత?

న్యూఫౌండులాండు ద్వీపము చుట్టును సముద్రము మెరకగానుండును. ఆర్కిటిక్ మహాసముద్రమునుండి వచ్చు శీతల ప్రవాహముతో చేపలకాహారమగు కొన్ని మొక్కలు, జీవజంతువులు వచ్చును. వీనిని భక్షించుటకు లక్షలకొలది చేపలుచేరును. మెక్సికో సింధుశాఖనుండి వచ్చు ఉష్ణప్రవాహముకూడ ఇచ్చటనే శీతల ప్రవాహమును కలియును. ఈ ప్రవాహములో కొన్ని చేపలు కొట్టుకొనివచ్చును. అందుచేత చేపల వేటకు ఈ దీవి ప్రపంచములోకెల్ల పేరుపొందినది.

(సశేషము.)

---

## చిన్నబిడ్డల చిత్తవృత్తులు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

(వెనుకటి సంచిక తరువాయి)

### సూచన

నిర్మాణము తరువాత శిశువుల విద్యాజీవితమును ముఖ్యపాత్ర వహించునది సూచన. సూచన యనగా నొకడొక సలహానుజెప్పి నపుడు దానిని విమర్శనా పరామర్శలు లేకయే సదరు సలహాప్రకారము నడచుకొనుట. చిన్న బిడ్డల నైతిక జీవిత నాటకరంగమున నిది దొలితావు నాక్రమించును. అడకువదీనికి చేదోడు వాదోడై క్రొంగ్రొత్త దోహదమొసంగును కాన శనీసూచన యాచరింపబడవలయునన్నచో శిశువుల మానసక్షేత్రమున వినయ విధేయతా బీజములంకురింప వలయును. ఇవియేగాక సూచించు వారియెడల ప్రత్యేకమగు నమ్మకముండిననే దప్ప నాసూచనను వారాచరింపఁజాలరు. ఏదియెట్లున్నను నాజ్ఞకంటె యిది యన్ని విధముల నుత్తమోత్తమమైనదని నొక్కిచెప్పక తప్పదు.

### వ్యతిరేక సూచన

సూచనలలో వ్యతిరేక సూచనయును

నవొకటిగలదు. ఒక్కొకసారి సూచనయే వికటించినపుడు వ్యతిరేక సూచనయగును. సూచకునియందు లక్ష్యముండనిచో నిది సంభవించుట కవకాశము గలుగును. అందుచేతనే బడులలో నీతివాక్యము లుండరాదను మన తత్త్వ సిద్ధాంతవాద మొకటి గలదు. ఆకారణముననే "బీడీలు త్రాగరాదు" అని నొక్కి చెప్పి విమర్శకుగురియై ప్రత్యక్షానుభవమునకు రహదారి తీయు వ్యతిరేక సూచనకంటె "బీడీలు త్రాగి గుండె బలహీనతయేర్పడి క్రమముగా నారోగ్యము చెడును. కాన బీడీలు త్రాగకుండుటమంచిది" యను సోదాహరణ పూర్వకమగు సామ్యసూచన యెంతయు శ్రేయోదాయకము.

**సూచ్యభావన కనుకూల పరిస్థితులు**

సూచన కనుకూలమగు పరిస్థితులుండిననే దప్ప నది యాచరణ రూపముననుంచబడజాలదు. వస్తువులపై నిశ్చితాభిప్రాయ వ్యక్తులయొక్క మానసిక దౌర్బల్యము, సూచ్యభావపు లక్షణములును, బిడ్డల వయస్సును దీని కనుకూలమైన పరిస్థితులు ఇందేదిలోపించినను సూచన తగువిధముగ జరుగనేరదు.

**బిడ్డల చిత్తవృత్తులు ఉపాధ్యాయుని విధులు**

చిన్నబిడ్డల నైతిక, దైనిక, విద్యాజీవితమున నీసహజ ప్రకృతులగ్రస్థాన మలంకరించినవని నొక్కి వక్కాణింపక తప్పదు. అందుచే నుపాధ్యాయుడు బీజ ప్రాయములగు శిశువు సహజ ప్రకృతులను దగు విధమున మొలకలెత్తించి వారిని తగు విధమున సంస్కరించి వారి భావిజీవితమునకు వన్నెచిన్నెలను దీర్చి దిద్దు బాధ్యతనతడు శిరసావహింపవలయును. చిత్తవృత్తులు (సహజ ప్రకృతులు) వృద్ధినొందు కాలమును గమనించి వానిని క్షయముగాకుండ జూచి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడనగును. కాన వాని విమర్శ పరామర్శల కతడే మార్గదర్శకుడుగా నుండవలయును.

**ఉపాధ్యాయుని బాధ్యత**

వాని నవసరమునైనపుడు వ్యాపారాచరితముగా జేయవలయును. అతడు సహజ ప్రకృతుల నెప్పుడును అణచివేయరాదు. అట్లు చేసినచో నతడు దినదిన ప్రవర్ధితమగు శిశుమానసిక జీవిత వృక్షమును మొదలంట నరికి వేసినవాడగును.

ప్రత్యేకముగ నొక్కొక్క చిత్తవృత్తియందే యుపాధ్యాయుని బాధ్యత యత్యావశ్యమగు చున్నది. అదియెట్లో చూడవలసియున్నది. క్రీడయందాతని విధిచింత్యము. అతడు క్రీడాపద్ధతిననుసరించి పాఠముల నేర్పవలయును. పిల్లలకు తగినంత స్వేచ్ఛ నీయవలయును. వారికి స్వపరిపాలన మొసగవలయును. బిడ్డల మేధాశక్తులు వికాసవంతములగుటకై కొన్ని చేతిపనులను, శరీరపరిశ్రమల, నాతడు కల్పింపవలయును.

అనుకరణ విషయమున నాతడాదర్శప్రాయుడుగ సంచరించవలెను. బిడ్డలాతని జూచి యనుకరింతురు గాన నతడు వేషభాషలలోను, వర్తనము నందును, నిర్దుష్టత జూపి యాదర్శకత్వమును వారికి నిరూపింపవలెను. చక్కనిస్నాత ననుకరించునట్లు జేసి వారి యనుకరణశక్తిని, సక్రమమార్గమున నడిపింపవలెను.

జిజ్ఞాసవిషయమున నాతనివిధి యవశ్యము స్మరణీయము. తరగతియందు విజ్ఞానము నభివృద్ధి నొందించు ప్రశ్నల నాత

గును. అట్టిసుజ్ఞానము అబలకేల ఆవశ్యకముకాదు? సుదతులు గృహాంతర ధర్మములు నెరవేర్చుటకు నిర్ణీతలైరి. ఆ మాత్రమున విద్య నభ్యసించుటకు నారీమణు లనర్హులని యూహించుట యధర్మము. విద్య అమృతమువంటిది. దానివలన ప్రయోజన మొకరికుండి యొకరికి లేకపోవునా! ఈశ్వరసృష్టియందు స్త్రీ పురుషులు సమానులు.

సతులు సహధర్మచారిణు లగుటకును, అతిథిఅభ్యాగతి, మొదలగు పెద్దలయెడ భక్తి శ్రద్ధలతో ప్రవర్తించుటకును, తమబిడ్డలను గుణవంతులుగను, ఆరోగ్యవంతులుగను, జేయుటకును, పతివ్రతాలక్షణములుదెల్పు గ్రంథములను వైద్యగ్రంథములను చదివి అట్లు ప్రవర్తించుటకును, భర్తవరుమానమునుబట్టి కర్చుచేయుటకును, భర్తకు సమస్త సౌఖ్యములు కలిగించి తాను సుఖపడుటకును విద్యాజ్ఞానము వనితలకు ముఖ్యావశ్యకము.

విద్యాజ్ఞానము తల్లులకు లేకపోవుట చేత ఆరోగ్యవిషయములందు అజ్ఞానులై తమ బిడ్డలను జ్ఞానహీనముగా పెంచుచు, తాము సుఖపడుమార్గముగాని, తమ భర్తలను సుఖపెట్టుమార్గముగాని, తెలియక మూఢాచారములందు మునిగి మృగప్రాయులగుచున్నారు. తల్లి బిడ్డలకు ప్రథమ గురువగు తల్లి నిరంతరోత్సాహదాయినిగను, బోధనాశక్తి గలదిగను, ఉండవలయును.

మానినులకు విద్యనేర్చుటచేత జారత్వము మొదలగు దుర్గుణములు కలుగునన్న సంశయము అనేకులకున్నది. జారత్వము మొదలగు దుర్గుణములు దుస్సహవాసము చేతను, తల్లిదండ్రుల శిక్ష లేకపోవుట చేతను కలుగును గాని విద్యవలన కలుగునవికావు. ఒక దుష్టవనిత విటునకు లేఖ వ్రాసినదని స్త్రీ జాతికంతయు విద్యవలదని తలచుట కేవలము మౌర్ఖ్యము. జ్వరము వచ్చినవానికి అన్నముపెట్టిన విషమై చంపును. అతనికి అన్నము విషమైనదని అందఱు విసర్జింపవలసినదేనా? ఎవతె యోఒక మూఢురాలు జ్యోతి నెత్తిచూరులో నెక్కినదని అంధకారమును పోగొట్టి జ్ఞానభానూదయమును కలిగించి జ్యోతివలె ప్రకాశింపజేయు విద్యను అందఱు విసర్జింపవలసినదేనా? ఎటువంటి మంచి వస్తువైనను వ్యతిరేకముగా ఉపయోగింపబడిన అది విరుద్ధమై పనిచేయును. అది మన తప్పుగాని వస్తుదోషముకాదు గదా?

ఒకస్త్రీకి విద్యనేర్పుటవలన కుటుంబములో నందరికిజ్ఞానవివేకములు కలుగును. వినయము, శుచి, దయాస్వభావము, చురుకుదనము, సత్ప్రవర్తన, వీనిని వృద్ధిపరచుటకు విద్యయే సాధనము. విద్య లేక మగువలనేకులు తమ మగలకు ఉత్సాహము కలిగించుటకు బదులు విచారము కలిగించుచు కష్టసుఖములు తెలియక తమ పురుషుల మనస్సుకు విసుగుకలిగించుచున్నారు.

స్త్రీవిద్యవల్ల వారికిని వారిభర్తలకును, అనుకూల దాంపత్యము కలిగి సత్సంతానముబడసి, సౌఖ్యముతోను, సంతోషముతోను వర్ధిల్లుదురు.

---

# విద్యావిషయిక ప్రచారము.

[మారెళ్ళ వెంకటసుబ్బారావు, టీచరు, దమ్మాలపాడు.]

ప్రతి ప్రాథమికపాఠశాలోపాధ్యాయుడు తన పాఠశాల సక్రమముగాను, అభివృద్ధిగాను, నుండవలెనన్న, నతడు తన విద్యార్థుల వెంటనిడుకొని, విద్యావిషయిక ప్రచారముచేయుట ముఖ్యావసరమైయున్నది తాను చేయు ప్రచారమునందు ఈక్రింది విషయములను ముఖ్యముగా గమనించవలెను:—

1. ఉపాధ్యాయులు తమ పనులయందు నియమానుసార ప్రవర్తన గలిగియుండవలెను. అనగా Regular and Punctual గా స్కూలుపనులను నిర్వర్తించవలెను.

2. స్కూలుకు హాజరయిన విద్యార్థులను క్రమశిక్షయందుండునట్లుజేసి, వారికి సద్బోధ గావించవలెను. నిర్బంధవిధానమునగాక, పిల్లలయొక్క మానసిక ప్రవృత్తులను బట్టి విద్య గరపవలెను. అట్లుచేయుటవలన బాలురకును, ఉపాధ్యాయులకును అవినా భావసంబంధము కుదురగలదు.

3. విద్యార్థులు పాఠశాలయందు నేర్చుకొనిన విషయములు, చేసినపనులు, వగైరాలను ఇంటివద్ద తల్లిదండ్రులు చూచి సంతోషించుట కవకాశము కలుగజేయవలెను.

4. విద్యార్థుల తల్లిదండ్రుల పోషకసంఘముల నేర్పాటుచేసి, ఆసభలను పాఠశాలయందు అవకాశముండినపుడెల్ల అనగా కనీసము నెలకొక్కతూరియైనను జరుగునట్లు చూడవలెను. అట్టి మీటింగులలో విద్యయొక్కవిలువ, దాని లాభములు, విద్యార్థులు దానిని నేర్చుకొను విధానముల గురించియు, విద్యార్థులు సక్రమముగా స్కూలుకు హాజరగుట, అందువలన కలిగెడి ఫలితములు, మొదలగు వానిని గురించి విమర్శించి, తద్వారా విద్యార్థులను పాఠశాలకు Regular and Punctual గా హాజరగునట్లు తల్లిదండ్రులను ప్రోత్సాహపరుపవలెను.

5. ప్రతిసంవత్సరమందును పాఠశాలయొక్క వార్షికోత్సవము (Anniversary) నేర్పాటుచేసి అందు విద్యార్థులచే నాటకమును వేయించవలెను. అట్టి సమయమందు విద్యార్థులుచేసిన పనిముట్లును, ప్రోగుచేసిన నమోనాలును, (Specimens), తయారుచేసిన ఛార్టులను, ప్రదర్శింపవలెను. అందు బాగుగా నున్నవానికి బహుమానముల నివ్వవచ్చును. ఇట్టి వార్షికోత్సవములకు, ఆ రేంజికి సంబంధించిన యినస్పెక్టరుగారిని ఆహ్వానించి, వారిచే జరిపించిన బాగుండును.

6. సంవత్సరమున కొక్కసారి ఆరోగ్యశిశువారము నేర్పాటుగావించి, అందు పోటీపందెముల నేర్పాటుగావించి అందుగెలిచినవారికి బహుమానముల నివ్వవలెను. హెల్తు యినస్పెక్టరు, హెల్తు ఆఫీసరుమొదలుగాగల ఆరోగ్యశాఖోద్యోగుల నాహ్వానించి, వారిచే నుపన్యాసముల నిప్పించ వలెను. హెల్తుయినస్పెక్టరుగారిచే మాజిక్

లాంతరు ప్రదర్శనము నేర్పాటు గావించి బాలురకు చూపించి, యుపన్యాసముల నిప్పించవలెను. ఆరోగ్యనాటకమును నేర్పి వేయించిన బాగుండును.

7. విద్యార్థులకు విద్యా ప్రచారసంబంధమయిన కీర్తనలు, పాటలను, నేర్పవలెను. నెలకొక పర్యాయమైనను ఉపాధ్యాయుడు బాలురనందరిని తీసికొని, విద్యా విషయిక ప్రచారపు పాటలను బాలురచే పాడించుచు గ్రామవీథులయందు తిరుగవలెను. ఇందువలన బాలురకు వారి తల్లిదండ్రులకును, నుత్సాహము మెండగును.

ఇట్లు విద్యావిషయిక ప్రచారము సల్పుటవలన విద్యార్థులు పాఠశాలకు సక్రమముగా హాజరయి, విద్యనేర్చుకొనగలరు. ప్రతిబాలుడును ప్రాథమికవిద్య పూర్తి యగువరకు అనగా 5 వ తరగతి ప్యాసగువరకు విద్యనేర్చుకొనునట్లు చూడవలెను. ఇటుల చేయుటవలన విద్యానష్టమును తగ్గించవచ్చును.

---

పద్యకథ

# గువ్వల చెన్నుఁడు

రచయిత ఘంటసాల దుర్గాప్రసాదరావు

1. విజయనగరంబు సత్కళావిలసితంబు । భూరిజనులకు నిలయంబు; భోగములకు
నాలవాలంబు, విబుధాళి కాకరంబు । తాతలకు పుట్టినిల్లయి ధరణిఁ బరగు.
2. కాష్టవిక్రయవృత్తిని-కాలమెటులో । గడపుచుండెను చెన్నుఁడాకాలమునను
వితరణగుణాధికతచేత వివిధజనుల । యుల్లసములెల్ల దనియంగ చెలువమొప్ప.
3. భట్టుకవి యొక్క-శతకంబుఁ బలికె నతని । యీావి జగమెల్లఁ దెలియంగ; నెవనినోట
వెడలినను నానిపద్యముల్ వెడలుచుండె । పామరులు పండితులు భళీ! భళీ!యనంగ
4. కృష్ణరాయనికోటలో కీర్తనములు । గువలచెన్నుని దాతృత్వగుణము గూర్చి
సంతతము వీనులం బడ వింత గొలిపె । కృష్ణరాజేంద్రు మానసగృహమునందు.
5. భట్టుకవితల్లజుని బిల్చి పల్కె-నతడు । "కోటలోనికి చెన్నునిమాటలెల్ల
బ్రాకజేసితి వరత సంభావ్యుడగునె అంతనిఋపేద కెటులబ్బె నంతయీావి !
6. అంతసందేహమెందుల కధిపనీకు నీవె శోధింప చక్క-గా నెఱుకపడును
రమ్ము నాతోడ మారువేసమ్ము బూని అనుచు భట్టు పలుకగను నరిగెనృపుడు.
7. ఇరువురును బోవుచుండంగ చెఱువునొద్ద చేపలను బట్టుచుండెను చెన్నుడపుడు
భట్టు చెన్నునిపై బల్కె- పద్య మొకటి యతనిదాతృత్వగుణమును నతిశయింప.
8. భట్టు కీయంగ కాసైన వద్దలేక హృదయమున కొంతవరకును వ్యధను బొంది
చెఱువులోనికి గెంతె నాచెన్నుడపుడు నృపవరుండును భట్టును నిలచిచూడ
9. కవివరా వెదకి చూడంగ కాసులేదు గనగ కౌపీన మొక్క-టే కలదు నాకు
దీని గైకొను మనుచును తీవ్రముగను విసరె చెన్నుండు భట్టుపై వినయముగను

10. భూపతికి సంభ్రమాశ్చర్యములును బొడమె । వాని వితరణఘనతకు మానసమున
సకలసంపద లిచ్చెను సంతసమున । పేదరికము తొలంగగ పేర్మిగలుగ
11. నాటికిని నేటికిని చెప్పునినామ మవని । శాశ్వతంబుగ నిలచెను, శతక మీపుడు
నాంధ్రలోకాన ప్రతివాని కాదరంబు । గొలుప బాలురు జదువుడు రెలమి నేడు.

---

## పరిచయము

భ్రాతృజనులారా!

చిద్విలాసమును ఈ ప్రదర్శనము శీర్షికకనువుగాఘుంమను. రంగ రంగమునకు అవి నాభావ సంబంధము లేదు. ఎలిమెంటరీ పాఠశాల బాలురకు సునాయాసముగ ప్రదర్శింపవీలగును. ఇంచుమించు నలుబది బాలురు ఈ ప్రదర్శనములో పాల్గొనవచ్చును. దీన్నిని ప్రత్యేకముగా నచ్చొత్తింపదలచితినిగాని కారణాంతరములచే నవకాశము లభింపలేదు. కాన ఈ మాసపత్రికద్వారా ప్రకటించుచుంటిని. ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్యా సంపాదకులకు నేననవరతము కృతజ్ఞుడను.

ఇట్లు,
విద్వత్పాదరేణువు,
కోడాలిదామోదరయ్య.

అంగలూరు,
స్వభాను సంవత్సరపుష్య బ ౧౧ లు.

# చిద్విలాసము

(బాల బాలికా ప్రదర్శనమున కుపయోగపడు చిన్న నాటిక)

రచయిత : కోడాలి దామోదరయ్య - అంగలూరు.

## మొదటి రంగము

(స్థలము - గ్రామపంచాయితీబోర్డుఆఫీసు, ప్రెశిడెంటు, 4 గురు సభ్యులు, కూర్చుండగా తెఱలేచును.)

ప్రెశిడెంటు:-సభ్యులారా, నిన్నటిదినమున గ్రామరజకులందఱు, ఒక సభ గావించి, బేసికన్నులస్వామియగు నా పార్వతీపతి యాలయ నిర్మాణమునకై నూరు రూప్యములను కోరియుండిరి. ఇందు మీా మీాయభిప్రాయములను విపులీకరించిచెప్పుడు.

1 సభ్యు:-అయ్యా, సర్వలోకపూజ్యుడును దీనరక్షాదక్షుడును కరుణా సముద్రుడును అగు నంబికాపతి యాలయనిర్మాణమునకు మనము శంకింపనగత్యము కానృట్టదు.

2 సభ్యు.-ప్రెసిడెంటుగారూ! ఈవిషయమును మనమంతగా తర్కింప నవసరము లేదు.

3 సభ్యు:-అయ్యాలారా! నా మనవి నించుక యాలకింపుడు.

గీ॥ లేడు భగవంతు డనువాడు లే డటంచు । సాటిఘనులెల్ల నిత్యంబు చాటుచుండ
గుళ్లు గోపురము లటంచు గ్రుడ్డియేల ? । మనకు నందఱ కీలాటి మాంద్యమేల ?

4 సభ్యు-భగవంతుడుండెనాలేడా, యనుటకుగాదు మనమిచ్చట సమావేశమగుట. ఆప్రశ్న మన కసందర్భము. మూఢభక్తి పాత్రులగు చాకలివారి దృష్టిని వీక్షించి చూడవలెను. కాన మంజూరుచేయుట యుత్తమమని నాయభిమతము.

ప్రెశిడెంటు:-సభ్యులారా!

అధిక సంఖ్యాకుల యభిప్రాయములపై, ప్రస్తుత క్లిష్టపరిస్థితులనుబట్టి, యార్థిక లోపములు పెక్కులుండుటచేత 57 రూకలు శాంక్షన్ చేయడమైనది. (కొంచెమాగి) మఱియొక విషయము చూడుడు. అర్జీ యీదినమే వచ్చినది. మనయూరి ఎలిమెంటరీ స్కూలు హెడ్మాష్టరుగారు పాఠశాల యారోగ్యవార కార్యక్రమాను సరణకై 35 రూపాయిలు కోరియున్నారు: ఇందుపై మీ యుద్దేశ్యముల నెఱింగించుడు.

1 సభ్యు:-ఆరోగ్యవారమును గూర్చి మనకంతగా తెలియదు. ఆప్రధానోపాధ్యాయుని రావించిన దానిని గూర్చి బాగుగా నెఱుంగవచ్చును.

ప్రె:-ఎవడురా అక్కడ?

నౌకరు.-(ప్రవేశించి) అయ్యా!

ప్రె:-హెడ్మాష్టరును ఒకసారి నేరమ్మంటినని చెప్పుము.

నౌ:-చిత్తము (నిష్క్రమణ)

హెడ్మాస్టరు:-(ప్రవేశించును.)

ప్రె:-రండి. కూర్చోండి. మీయర్జీయందినది. దానినిగూర్చి మాసభ్యులకు అంతగా దెలియదు. మీ కార్యక్రమము తెలిపెదరా?

హె:-అందేమున్నదండీ? మా ముఖ్యోద్దేశము గ్రామమున ఆరోగ్యము నెలకొల్పుట. అజ్ఞానాంధకారమునబడియున్న గ్రామస్థుల మేల్కొలిపి యుపన్యాసములు, నాటకములు, మొదలగు విషయములచే వారికి విజ్ఞానము కలిగించుట, ఆరోగ్యమే ఆనందదాయకమైనదనియు, మహాభాగ్యమనియు, సౌఖ్యప్రదమనియు, అయ్యదిలేని జీవితము నిష్ప్రయోజనమనియు, నిరాశాయుతమనియు, అయ్యది యమూల్యమనియు కల్పతరుతుల్యమనియు, ప్రజలకెఱింగించుట, ఆరోగ్యపద్ధతులను విపులీకరించి బోధించుట, ఇందుకుగాను బాలురయుత్సాహాభివృద్ధికై పోటీలలో గెలుపొందినవారికి బహుమతు లిచ్చుట; వూరేగించుట, బాలురచే తల్లిదండ్రుల యానందమునకై నాటకము వేయించుట, ఘనులగువారిచే నుపయోగకరములైన యుపన్యాసము లిప్పించుట, ఇత్యాదివిషయములు మా కార్యక్రమాంశములు.

1 సభ్యు:-బాగున్నదండీ. ఈ యారోగ్యవారములుప్రతి వత్సరము ఆవశ్యకమే.. వీటిసేవ చెప్పశక్యముగాదు. తప్పక వీరికాడబ్బు మంజూరిచేయవలసినదే.

2, 3, 4, సభ్యు:-మాకును ఇష్టమే.

ప్రె:-మంచిది మాష్టారూ! మీకు డబ్బు కొంచెమాగి పంపెదనులెండి.

హె:-కృతజ్ఞుడను. నాకింక సెలవు.

ప్రె:-మంచిది.

హె:-(నిష్క్రమించును.)

ప్రె:-సభ్యులారా !

ఈ ప్రధానోపాధ్యాయుని కృషి యపారము. ఉపాధ్యాయులు చాల గొప్ప వారు. బాలురను ఉత్తమ పౌరులగా తయారుచేయగలరు ఉపాధ్యాయవృత్తి శ్లాఘనీయము. అజ్ఞానమను చిమ్మచీకటిని, విద్యయను రవికిరణములద్వారా పటాపంచలు జేయుదురు.

ఆహా యుపాధ్యాయుని ఘనత!

ఉ॥ చీకటితోనె లేచు మఱిచీకటితోనె పరుండు జీతమున్
నాకును జాలదో యనడు నాగటిమానిసివోలె గష్టమున్
దేకువ జేయుచుండు గమనింపడు పేద్దతనంబు వెట్టిగా
చాకిరి జేయుచుండు శిరసా వహియించును నెవ్వ రేమనన్.

2. సభ్యు:— పాపము! ఆయనజీవితమును గమనించుడు.

ఉ॥ తా నధికారులానతీవిధంబున బోవు నెగాని యెన్నడున్
దా నిసుమంత మారనడు దప్పులువట్టడు నిస్పృహత్వమున్
బూనడు మానివోలె దనపొట్టకు గోరడు కల్గినంతలో
దా నయవృత్తితో బ్రదుకు దారసుతాదిక పోషణంబునన్.

1. సభ్యు:—నిజమేకాని కుగ్రామములయందతని ప్రభ చూడుడు!

ఉ॥ తానె తమోవినాశకుడు తానె చరాచరవస్తుతత్త్వవి
జ్ఞానరహస్యబోధకుడు తా వెలిగించును జ్ఞానచక్షువై
మానవకోటినెల్ల నభిమానముతో దరియింపు డాతనిన్
గానుక లిచ్చి మెచ్చదగు గౌరవ మిచ్చి భజించి నిచ్చలున్.

ప్రె:—కాలాతీతమైనది. సభముగింతము

(అందఱు నిష్క్రమింతురు తెఱ వ్రాలును.)

## రెండవ రంగము – ప్రథమదృశ్యము.

(స్థలము – గ్రామబహిరంగ ప్రదేశము పాటకపుజనులు. కర్షకులు, ధనికులు, కూర్చుండియుందురు. సోషలిష్టురంగారావు మీటింగు)

రంగా:—సోదరీ, సోదరులారా!

చం॥ ఇల గల గొప్పవారు మఱియెల్లరు నీకృపఁ గాదె ద్రవ్యముల్
గలిగి సుఖంబుగా బ్రతుకఁ గాంచుట పేరును బొందు టారయన్
గలమును కాగితమ్ము మఱిఖడ్గము నీకును సాటియౌనె నీ
హలమును బట్టి దేశముల నన్నిటి కావగదయ్య కర్షకా!

రైతుసోదరులారా, కూలీబృందములారా!

మనలో సంఘీభావమవశ్యము. ధనికుల యత్యాచారమును నిర్మూలించు శక్తి యేకత్వము. ధనికులదురాశాపిశాచముల దెగటార్చి మనజీవితములు కాంతియుతములు గావించుకొనవలయును. కష్టజీవుల్లారా! పగలెల్లా రెక్కవిర్చుకొని వెట్టిచాకిరిచేసిచేసి 'మాకష్టం మీసుఖం' అని వారిచేతుల్లోనే పోస్తున్నాము. ధనికులు ప్రజలలో మెప్పు పొందుటకై, జీవితాన్ని తుచ్ఛసుఖముల కాటపట్టొనరించుటకై, మనరక్తాన్నిపీల్చి కోట్లకొలది రూపాయలుకూడ బెట్టుచున్నవారు. పోనీయింతాచేస్తేమన కేమైనాలాభం కలుగజేస్తారా అంటే అదీలేదు. వాళ్లు చదువుకునే కళాశాలలకు, వాళ్లు ఆడుకునే క్లబ్బులకు వాళ్లు ఆనందించే నాట్యమండలాలకు, భూరివిరాళాలిస్తారు.

(సభనుండి అడ్డుమిల్లి అక్కయ్యనాయుడు యను ధనికుడు లేచును.)

అక్కయ్య:—ఏమండీ రంగారావుగారూ! మీయుపన్యాసము వినుట కసహ్యముగానున్నది. ధనికులు ధనమున్నదని గర్వింపక, ప్రతిసంస్థకును చందాలిచ్చి దానధర్మము లపారముగా చేయుచుండుట మీరుకాంచుటలేదా? మొన్ననేగదా శివాలయ, నిర్మాణమునకు చాకలివారికి 116 రూపాయిలు ఇచ్చియుంటిని.

రంగా:—చిత్తము తమరుకొంచెమువినండి. సోదరులారా! ఇట్టిగుళ్లుగోపురాలు కట్టించేదెందులకో మీకు తెలియునా? భగవంతుడు, మతము, న్యాయము, పాపము అనే మత్తులో మనల్ని పడద్రోసి యింకాదోచుకోటానికి భగవంతుణ్ణి అండగా చేకొని యింకా పాపాలుచేయటానికి ఇంకాద్రోహాలు చేయటానికి ఇంకాదురంతాలు చెయ్యటానికి ఇం[blot]ర క్తము పీల్చటానికి ఇంతేకాని మనమీద దయదల్చిగాదు.

(అక్కయ్యకోపముతో రంగారావువైపు తీవ్రముగాచూచుచు సభనుండి నిష్క్రమించును)

రంగా:—ఈరోజున మనము పస్తుంటే చిల్లిగవ్వకూడ రాల్చరు. కూలీలు తమ దుర్భరస్థితిని గమనింపకుండునట్లు వారికొరకై పాటుపడుతున్నట్లునటిస్తారు. మనమంతా కట్టుబాటుగానుండి మనశక్తిని, మనబలమును, మనరక్తము గ్రోలు రాక్షసులకు ప్రకటిస్తే వారి కపటనాటకాలు పటాపంచలవుతాయి. కాన కూలీలలో ఐకమత్యముండవలెను. రైతులలో సంఘీభావము కావలెను.

(సభికులు, కూలీసంఘాలకు, రైతుసంఘాలకు, జైకొట్టుదురు తెరవాలును)

## రెండవరంగము (ద్వితీయదృశ్యము)

స్థలము - కోర్టు న్యాయవాదులు గుమస్తా బంట్రోతు, కొద్దిజనులు, అడావుడి గాకూర్చుండి యుందురు.

(తెరలేచును)

డఫేదారు:—(ప్రవేశించి) సైలెన్సు, సైలెన్సు, సైలెన్సు. (నిష్క్రమించెను)

జడ్జి:—(ప్రవేశము) అందఱు లేచి కూర్చొందురు.

గుమాస్తా:—(బంట్రోతువైపుచూచి) అడ్డుమిల్లి అక్కయ్య నాయుడుగారు!

బంట్రోతు:—అడ్డుమిల్లి అక్కయ్య నాయుడుగారూ! (బిగ్గరగా 3 సార్లు)

అక్కయ్య:—(ప్రవేశించిబోనెక్కను)

గుమాస్తా, దేవునిముందు ప్రమాణముచేసి అంతానిజమే చెపుతాను అబద్ధము చెప్పను అని (ప్రమాణముచేయించును)

1 ప్లీడరు:—ఏమండీఅక్కయ్యనాయుడుగారూ, చోడవరపు రంగారావుగారిపై మీరు విప్లవము రేకెత్తించుచున్నాడను అభియోగము తెచ్చిరి. అదెట్లు ?

అక్కయ్య:—అయ్యా ! అతడు గ్రామగ్రామమునకు తిరికి కూలీలందఱిని ప్రోగు చేసి యుపన్యాసము లిచ్చుచున్నాడు.

1 ప్లీ:—ఏమని ?

అక్కయ.—కూలీ లేకముకావాలని సమ్మెలుచెయ్యాలని ధనవంతులు కూలీలనుమోసము చేయుచున్నారనీ, ప్రభుత్వము ధనవంతులకే సహాయము చేయుననియు, ఇంక నేమేమో ప్రేలుచున్నాడు.

జడ్జి:—సరే. నీవు వెళ్లుము. (అక్కయ్య నిష్క్రమించును.)

గుమస్తా:—(బంట్రోతువైపుచూచి సాక్షి వడ్డేనాగయ్యగారు)

బంట్రో:—వడ్డేనాగయ్యగారూ (3 సార్లు బిగ్గరగా)

నాగయ్య (ప్రవేశము గుమస్తా ప్రమాణము చేయించును.)

1 ప్లీ:—చోడవరపు రంగారావుగారి నెఱుగుదురా ?

నాగ:—ఆ.

1 ప్లీ—అతని దేయూరు

నాగ:—గుడివాడ తాలూకా సింగలూరు

1 ప్లీ:—అతడేమిచేయును ?

నాగ:—అనగా ?

1 ప్లీ:—వృత్తి ఏమియని ?

నాగ:—నాకు తెలియదు.

జడ్జి:—ఏమి తెలియును మఱి?

నాగ:—అతడొకవక్త. అప్పుడప్పుడు మాగ్రామమువచ్చి అందలి కూలీలను ప్రోగుచేసి మీరైక్యముకండనియు ధనికులను తిరస్కరించుడనియు ఉపన్యాసము లిచ్చుచుండును.

జడ్జి:—సరే ! నీవు వెళ్ళుము.

(నాగయ్య నిష్క్రమించును.)

గుమస్తా:— (బంట్రోతువైపు జూచి) ముద్దాయి చోడవరపు రంగారావుగారు.

బంట్రో:—చోడవరపు రంగారావుగారూ ( 3 సార్లు)

రంగారావు (ప్రమాణము చేయించుదురు )

2 ప్లీ:—మీ నివాసము.

రంగా:—సింగలూరు

2 ప్లీ:—వృత్తి.

రంగా:—సర్వజనాధారమైన వ్యవసాయము.

2 ప్లీ:—నీవు విప్లవమును కల్గించుచున్నావట! నిజమేనా?

రంగా:—అవును.

2 ప్లీ:—అందు నీ యుద్దేశ్యమేమి?

రంగా:—అమాయకులైన కూలిప్రజలకు జ్ఞానోపదేశముగావించి తద్వారా వారి జీవితము సుఖప్రదముగను శాంతియుతముగను, సౌభాగ్యసహితముగను, చేయుట నా యుద్దేశ్యము. దురాశాపీడితులును పాపసహితులును, దుర్మార్గులునగు ధనికుల క్రొవ్వడంగించుటకూడ నా కార్యక్రమము.

జడ్జి:—సరే నీవు వెళ్ళుము. (ప్లీడర్ల వైపుచూచి) గోఁ గోన్ డోన్టు వేస్టుమై టైమ్, (Go on go on, don't waste my time)

2 ప్లీ:— యువర్ ఆనర్ సార్, (Your honour Sir)

ఈ కేసులో ముద్దాయి చోడవరపు రంగారావుగారు నిర్దోషియని తెలియు చున్నది. కూలీల మంచికొరకు ఉపన్యాసము లిచ్చుచున్నాడే గాని విప్లవము రేకెత్తించుట లేదు.

2 ప్లీ:—నెవ్వర్ (Never) అతనియుద్దేశ్యమే విప్లవము రేకెత్తించుట.

జడ్జి:—ఆర్డర్ (Order)

1 ప్లీ:—అతడొక సామాన్యరైతు. తన రైతుసోదరులకొఱకు పాటుపడుచుండె నేగాని ఏమియు దుడుకుపనులు చేయుటలేదు. అతనిపై నిందమోపిన అక్కయ్యనాయుడు స్వలాభి.

2 ప్లీ:—యువర్ ఆనర్ సార్ (your honour Sir)

ఈ చోడవరపు రంగారావు ప్రభుత్వచట్ట నిబంధనలకు వ్యతిరేకముగా ఉపన్యాసములిచ్చు చున్నాడు. సదరు అక్కయ్యనాయుడుగారు ప్రభుత్వమునకు మిత్రుడగుటచే ప్రభుత్వక్షేమమునకై పాటుపడుచున్నాడు. కాన రంగారావు దోషియే.

జడ్జి:—(కాగితముపై తీర్పువ్రాసి కాగితము నటునుంచి వెళ్ళును.)

గుమస్తా:—(కాగితము చదువును) తీర్పు ఈ కేసులో ముద్దాయి ప్రభుత్వచట్ట నిబంధనలకు వ్యతిరేకముగా నుపన్యసించుచుండెననియు, కూలీలందు రైతులయందు విప్లవము రేకెత్తించుచుండెననియు వాదప్రతివాదన ద్వారా ధ్రువపడెను. కాన సదరు ముద్దాయి చోడవరపు రంగారావుగారికి ఇండియారక్షణ చట్టము 120 'సి' శక్షనుక్రింద 6 నెలలు కఠినశిక్ష విధించబడెను. (తెఱవ్రాలును.)

---

# మే లు కొ లు పు

బాలకవి అన్నాప్రగడ వీరరాఘవయ్య

చ॥ ఒడ లెఱుఁగంగరాని ప్రబలోత్కలు గాఢ సుషుప్త్యవస్థలోఁ
బడి మునుఁగంగనేలకొ! ప్రభాకరుఁ డిమ్యోడ దూర్పుకొండపైఁ
బొడమెను గాఱుచీకటులు వోయెను మాయనులొంచు వెల్లును
దడయఁగనేల లెమ్ము పెడదారిని బోకుము భారతీయుఁడా!

ఉ॥ వేదరవంబు లెల్ల వినిపించెడు మంజుల సుప్రభాతమే
రాదని యెంచఁజాలవో? విరామ మెఱుంగని కోడికూత లే
యాదరువాయెనా? చరమయామమునందు శకుంతరావముం
గాదని. నిద్రవోవు వెడఁగా! ఇఁక మేల్కొనుమోయి సోదరా!

ఉ॥ ఓయి అయోమయానఁ బడి యూరకె ధైర్యము వీడియప్పుడే
యాయువు గ్రుంగు జీవిపలె నట్టిటు జూచెదవేల? ఎన్నియో
శ్రేయములన్ రచించి జగదేకయశంబున దేశగౌరవా
ధ్యాయముఁ బైఁడియక్షరవితానముతోడ లిఖింపఁ బూనుమా.

ఉ॥ తావకభాగ్యజీవనవిధానము నీచపుఁ బారతంత్ర్యపుం
భావముఁ జెందె నాశనముపాలయి పోయెఁ బ్రతిష్ఠ సర్వముం
బావనమాతృభూమి కనవద్యము తీఱని సేవఁ జేసెదో
ఈవిధి బానిసత్వమున నిక్కటులం బడెదో తలంచుమా.

తే॥ గీ॥ సుదలఁ గేరెడు స్వాతంత్ర్య మధురిమంబు
కన్న సుఖమౌనె దాస్యశృంఖలములందెఁ
బంజరపుఁ గీరముం భాతి వాంఛ లుడిగి
వంత నొందగనేలః దౌర్భాగ్యజీవి!

ఉ॥ పంటలు పండవా మనకుఁ? బాడికి లోపమ యేమి? వేళకుం
దింటకుఁ గూడు లేక మఱిదిక్కును ద్రోవయు లేనిపక్షులై
యుంటకుఁ గొంపలేక శ్రమకోర్చెడు బిడ్డలఁ గోడుఁ జూచుచుం
గంటికి నీరువెట్టు వెతగలెను మాతకు భారతీయుఁడా!

చ॥ ఎపుడు విదేశయంత్రతతి యేఁచి స్వదేశము వీడివచ్చెనో
అపుడె పరిశ్రమాళి హతమారెను జేసెడివారు లేమి నీ
విపుడు బరిక్రమింప ఫలమేది? గతంబును విస్మరింపకే
యపరము నూహఁజేసి హృది నర్పణఁజేయుము దేశసేవకున్.

సీ॥ పరికింపవోయి సద్వర్తనఁ దిగనాఁడి తమలోనఁ బోరు సోదరజనంబు
కనవోయి! ఘనులరీతినె యుండి యితరుల న్వంచన సల్పెడు స్వార్థపరుల

తిలకింపవోయి! బీదలర క్షముం బిల్చి యుదరాల నింపు భాగ్యోన్నతులను
అరయంగ దోయి! విద్యాగంధశూన్యులై మంత్రాడునట్టి యమాయకులను
తే॥గీ॥ ఈక్షణము సేయుమోయి యస్పృశ్యు లనుచు విడువఁ బడినట్టి మానవవితతి నెల్ల
సరిగ వీక్షింపుమోయి! పాశ్చాత్యదేశ । నాగరికతకు వశులైన నవయువకుల

ఉ॥ లెమ్మిక నిద్రనుండి మది లేశము సందియ మందఁబోక రా
రమ్ము గృహమ్ము వీడి స్వపరంబుల యోజన మానివేసి గ్రా
మమ్ముల నుద్ధరింపు మసమానప్రయత్నములం బొవర్చి దే
శమ్మునఁ బూర్వపద్ధతుల సాగఁ జేయు మనిందితోన్నతిన్.

సీ॥ స్థాపింపు మింకనైన సకలభారతభూమి జాతీయతానూనస్తంభమంబు
ఆలింపు మింకనైన నన్నపానములకు నూరులై గుందు నార్తులరవంబు
సమయింపు మింకనైన జ్ఞానచంద్రికచేత నహమికాజ్ఞాన మహాతమంబు
తొలఁగింపు మింకనైన నలఁతులఁ బోవక ప్రాకులాడెడు నంటరానితనము
తే॥ గీ॥ ఇనుమడింపంగ నొసరింపు మింకనైన భారతీయులలోన సౌభ్రాత్రమహిమ
నమరఁజేయుచు నైకమత్యంపు పటిమభవ్యయశమును గొనుమోయి! భరతపుత్ర

సీ॥ జననిదాస్యముమాన్పఁ జని యమరేశుతో ననిసల్పు నైనతేయుని విధంబు
తల్లియాజ్ఞను దలఁదాల్చి శత్రువులనెల్ల సంహరించిన్న బాలచంద్రురీతి
జనయిత్రిబోధచే సకలసామ్రాజ్యవిజేతయౌ నల శివాజీపథంబు
మాతృభూమికిఁ బ్రాణమానము లీ వనసీమఁ జేరు ప్రతాపసింహుదారి
తే। గీ॥ దేవసేవకు బలియౌ నుదీర్ణమతుల తెరఁగుఁ దలపోసి యొకక్రొత్త తెల్వినంది
చిత్తమలర స్వాతంత్ర్యసంసిద్ధికొఱకు జతనముల సల్పవోయి! భారతకుమార!

---

## నొసం - కర్నూలుజిల్లా

ది **11-1-1944** తేదీ రాత్రి 8 గంటలకు నొసం బోర్డు మిశ్రమ ఉన్నత పాఠశాలా పోషకసంఘ సమావేశము మండల విద్యాశాఖాధికారులగు శ్రీ ఎ. పద్మనాభరెడ్డి, బి.ఏ., యల్.టి., గారి యాధిపత్యమున చాల జయప్రదముగా జరుపబడెను. పెక్కుమంది స్త్రీలుగూడ హాజరైరి. ప్రాథమిక విద్యా చరితము, శ్రీ స్టాలింధొరవారి కృషి, ఉపాధ్యాయుల తరిఫీతు, అవిద్యా పిశాచ నిర్మూలనము, పౌరుల విధులు, ప్రచారావశ్యకత, మొదలగు అమూల్య విషయములనుగుఱించి గంభీరముగ నుపన్యసించిరి. మా రేంజి డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారైన శ్రీ యం. కృష్ణమాచార్యులు **B A., B.Ed.,** గారు శ్రీమండల విద్యాధికారుల వారి సలహాలను విధేయతతో నడుపు పఱచవలసినదిగా కోరిరి తల్లిదండ్రుల సంఘాధ్యక్షులగు శ్రీ కె. యెరుకలరెడ్డిగారు కొట్టముల నిర్మాణమునకు సాయపడెదననిరి. శ్రీ డాక్టరు జె. సోమసుందరం **D. M. S.** గారు అభినందన వందనము లర్పించిరి. విద్యార్థుల వాయులీనగానముతో సభ ముగిసెను.

సూరి వేంకటేశ్వర్లు,
కార్యదర్శి.

అనంతపురంజిల్లా, గుత్తితాలూకా, గడేకల్లు బోర్డు హిందూశిలో ఎడ్యుకేషన్‌స్కూలునందు 18-1-44 దినము శ్రీయుత జి. సోమిరెడ్డిగారు, జిల్లా ఆర్గనైజర్ నేషనల్ వార్‌ఫ్రంట్, అనంతపురం వీరి అధ్యక్షత క్రింద బడిపిల్లల తల్లిదండ్రాదుల విద్యాపోషక సంఘము జరిగెను.

బాలురనుండి దైవప్రార్థన గీతములు చెప్పబడినతర్వాత బాలికలు Ist అసిస్టాంటు మిస్ట్రెస్‌గారగు పి. సీతమ్మ గారితో స్వాగత గీతములు పాడును పూలు, పండ్లు అధ్యక్షులవారికి సమర్పించిరి

తదుపరి హెడ్‌మాస్టర్‌గారగు బి. వి సంజీవరాయుడుగారు బాలురతో యుద్ధగీతములు, విద్యా గీతములు, వినువారల కానందమగునట్లుగా పాడించిరి.

తదుపరి గడచిన నెలలో శ్రీయుత వార్‌కమిటీ సెక్రటరీగారైన కె. క్రిష్ణారెడ్డిగారి అధ్యక్షతక్రింద జరిగిన మీటింగు మినిట్సు IInd అసిస్టాంటు టీచర్‌గారగు యస్ యమ్. నాగలింగస్వామిగారు చదివిరి.

ప్రెసిడెంటుగారగు జి. సోమిరెడ్డిగారు విద్యావిషయమునుగురించి బాల బాలికల తల్లిదండ్రాదులు చదువుపై ఇష్టము, శ్రద్ధగల్గి బాలబాలికలను శ్రద్ధగా బడికి పంపవలెననియు, బాలురు శ్రద్ధగా చదువుకొన వలెననియు బాలబాలికలు విద్యయందు శ్రద్ధ చూపినయెడల తల్లిదండ్రాదులచేత కానున్నయెడల సర్కారు వారు అన్నిసౌకర్యములుచేసి ఇచ్చెదరని నొక్కి చెప్పిరి. స్త్రీలుకూడా చక్కగా చదువుకొని పురుషులలాగు వృద్ధికిరావలెననియు, స్నానముచేసి సరస్వతీపూజ సల్పి పాఠములు చదువుట ఒక్క అలవాటుగా పెట్టిన యెడల శరీర శుద్ధి, మనశ్శుద్ధి గల్గి, చిత్తము చదువబోవు పాఠముపై నిల్చి త్వరగా నంటునని చెప్పిరి. ప్రస్తుత యుద్ధ పరిస్థితినిగురించి యుద్ధపు బాండ్లును గురించి, రైతులు ఎట్లు ప్రవర్తించినదేశము, గ్రామములు, నెమ్మదిగా నుండునను విషయమునుగురించి విపులముగా చెప్పిరి.

ఈ పాఠశాలవెనుకటి విజిటింగు ఆఫీసర్లందరు ఇప్పటి ఉపాధ్యాయుల శ్రద్ధనుబట్టి స్కూలు అన్ని విధముల వృద్ధిచెందుచున్నదని వ్రాయబడినప్రకారము విషయములు చూచుకొని, ఈ బడియందుండు ఉపాధ్యాయులవలన స్కూలు చాలావృద్ధికరముగా నున్నదనియు, తమ అభిప్రాయముకూడా అలాగుననే యున్నదని, విజిట్టు పుస్తకమునందు వ్రాసినారు.

పిమ్మట ఈ సభ మంగళముతో ముగింపబడెను

గడేకల్లు.
25—1—44.

యస్. యమ్. నాగలింగస్వామి,
టీచరు.

## అనంతపురము తాలూకా కందుకూరు సెంటరు ఉపాధ్యాయసంఘము

1944 జనవరి 22 వ తేది జరుపబడెను. ఈ సెంటరుకు బుక్కచెర్ల సెంటరు ఉపాధ్యాయులు కూడ హాజరై యుండిరి.

మా జిల్లాఎడ్యుకేషనల్ ఆఫీసరుగారగు శ్రీ డి. నరసింహశాస్త్రి M. A. L. T. గారున్ను, సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారు కూడ వచ్చియుండిరి.

### దైవప్రార్థనానంతరము

కందుకూరు సెంటరు తరపున కుసుమహారసంయుతముగ స్వాగతపత్రము సమర్పింపబడెను. తరువాత శ్రీ D. E. O. గారు విద్యావిషయముల గురించియు, పిల్లలబడికి రాబట్టు విధానముల గురించియు, అమూల్యములగు సలహాల నొసంగిరి. శ్రీ సీనియర్ డిప్యూటి ఇనస్పెక్టరు కె. శంకరన్ గారు జాగ్రఫీబోధనావిధానములగు గురించియు ఉపాధ్యాయుల వేతనముల గురించియు ఉపన్యసించిరి.

సమావేశానంతరము అల్పాహారవిందు ఎల్లరకు ఒసంగబడి మంగళములచే సభముగింపబడెను.

రాజం లింగప్ప
సెక్రటరీ

కదిరి - అనంతపురంజిల్లా సి. ఐ. జి. మిషను స్కూలునందు 19-1-44 దినము అనంతపురం గరల్సు రేంజి సబ్‌అసిస్టాంట్ ఇన్స్పెక్ట్రిస్ యల్. బి జేకబ్ బి. ఏ. యల్. టి. గారి అధిపత్యమున సమావేశ మాయెను.

దైవప్రార్థనానంతరము సి. ఐ జి. మిషను స్కూలు హెడ్‌మిస్ట్రెస్ లిల్లీఫిలిప్సిగారు 3 వ॥ తరగతికి భూగోళమున కాశ్మీరబాలునిగురించి చాలాబాగుగ పాఠమునుతీసిరి. ఉపకరణములద్వారా కాశ్మీరదేశము లోని తోటలు, సరస్సులు, వృత్తి, ఆహారము. బాలికలకు తెల్పిరి కాశ్మీరదేశము బాలునివలె ఒకబాలికను వేషాధారణమొనరించి బాలికలకు స్పష్టముగా మన్మస్సునందునాటు నటులచేసిరి.

తరువాత శ్రీమతి సబ్‌అసిస్టాంట్ ఇన్స్పెక్ట్రిసమ్మగారు ప్రస్తుతయుద్ధపరిస్థితులగురించి విపుల ముగా ఉపన్యసించిరి.

జాతీయగీతముతో సభసమాప్తము గావింపబడెను.

కదిరి,
3—2—44.

బి. యం. శకుంతులమ్మ,
అసిస్టాంట్. టీచర్ బోర్డు హింనూగరల్సుస్కూల్.

# టీచర్సు అసోసియేషను అముజూరు

## రామచంద్రపురం తాలూకా.

1. శ్రీ రామచంద్రపురం రేంజీ స్కూళ్ళజూనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరు నేమాని వెంకట రామయ్యగారి అధిపత్యమున 29-1-44 తేదీన ఈ అసోసియేషను సమావేశమైనది. సభాసమావేశము దైవప్రార్థనతో ప్రారంభింపబడెను. సదరు సమావేశ సందర్భమున జరిగిన యంశములు.

2. 1. గతమీటింగు కార్యక్రమము చదువబడెను. 2. బోర్డు ఎలిమెంటరీ స్కూళ్ళు 12 ఎయిడెడ్ పాఠశాలలు 7 మొత్తము 19 బోర్డుఉపాధ్యాయులు $\frac{41}{45}$ ఎయిడెడ్ ఉపాధ్యాయులు $\frac{12}{15}$ హాజరుమొత్తం $\frac{53}{60}$.

3. లెంటరు తాలూకు జమాఖర్చులు సమాలోచన మైనది. ఖర్చులు అంగీకరించడమైనది. నిల్వ మొత్తం రు 22-13-6 లో ఖర్చు 1-13-6 లు పోను మిగిలినది రు 21-0-0 లు

4. శ్రీ ఇనస్పెక్టరుగారు స్కూలు టైముకాగానే తరగతులయొక్క హాజరుగురించి కాలనిర్ణయ పట్టిక ప్రకారం పాఠములు చెప్పవలెనని తెలియచేసిరి.

4. IV. V VI. VII VIII. తరగతుల బాలబాలికలకు క్రొత్తసిలబసు ప్రకారము వ్రాయబడ్డ జాగ్రఫీలోని ఉత్తరధ్రువ ప్రాంతములోని ఎస్కిమోలజీవితమునుగూర్చి విపులముగా బోధించిరి. (పటముల సహితో) ప్రస్తుతప్రపంచ సంగ్రామమందు, మిత్రమండలివారికి అన్నిరంగములయందు జయము చేకూరుగాక యని భగవంతునిగూర్చి ప్రార్థించుచు ఈ సభవారు ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

అముజూరు
31—1—1944

అవసరాల రామారావు
సెక్రటరీ

వేమూరి వెంకట కృష్ణసెట్టి అండ్ సన్సు వారి, ఎ. కణన్ సెట్టి అండ్ కో., 288 ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింప బడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము. ఈ పుస్తకములకును యితర పుస్తకములకును, యీదిగువ చిరునామాకు వ్రాయవలయును. భారీగా ఆర్డరిచ్చువారికి మంచి కమీషను యివ్వబడును.

ప్రస్తుత యుద్ధపరిస్థితుల ననుసరించి పుస్తకముల వెలలు స్వల్పముగా పెంచవలసివచ్చినది. గాన యెల్లరు యెప్పటివలెనే ఆర్డరు పంపుచుండగోరెదము.

## శ్రీమద్భగవద్గీతా-ప్రతిపద టీకాభాష్య విశేషార్థసహితము.

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు, గిల్టు పేరు గలది | 6 | 0 | 0 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 8 | 0 |
| డిటో డిటో పేపర్ బైండు | 1 | 11 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్న సైజు, క్యాలికో బైండు | 0 | 8 | 0 |
| డిటో డిటో పేపర్ బైండు | 0 | 6 | 0 |

## శ్రీ మదాంధ్రమహాభారతము

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగలసంపుటము | 3 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము | 3 | 0 | 0 |
| 3 విరాటోద్యోగ పర్వములు | 3 | 0 | 0 |
| 4 భీష్మ, ద్రోణ పర్వములు | 3 | 0 | 0 |
| 5 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 3 | 0 | 0 |
| 6 శాంతిపర్వము | 3 | 0 | 0 |
| 7 అనుశాసనిక, అశ్వమేధ ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గల సంపుటము | 3 | 0 | 0 |
| 1 ఆదిపంచకము- ఒకటే సంపుటము. | 7 | 8 | 0 |
| 2 యుద్ధషట్కము. డిటో | 5 | 4 | 0 |
| 3 శాంతిసప్తకము. డిటో | 5 | 4 | 0 |
| భాస్కరరామాయణము | 5 | 4 | 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము | 2 | 8 | 0 |
| శ్రీరామకర్ణామృతము | 2 | 0 | 0 |
| భర్తృహరిసుభాషితము | 3 | 0 | 0 |
| అమరకోశము-త్రికాండము-సటీకము క్యాలికో బైండు చేయబడినది. | 2 | 8 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము అట్టబైండు. | 0 | 10 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము (పద్యకావ్యము-పోతనప్రణీతము)

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ ప్రతి ఒకే సంపుటము. | 8 | 0 | 0 |
| సంపూర్ణప్రతిరెండుసంపుటములుగా | 10 | 0 | 0 |
| ఒక్కొక్క వాల్యూము విడివిడిగా | 5 | 4 | 0 |
| సంపూర్ణప్రతి మూడు సంపుటములుగా | 11 | 0 | 0 |
| ఒక్కొక్క వాల్యూము విడివిడిగా | 3 | 12 | 0 |
| గజేంద్రమోక్షము క్యాలికో బైండు | 0 | 14 | 0 |
| డిటో పేపరుబైండు | 0 | 10 | 0 |
| రుక్మిణీకల్యాణము-క్యాలికోబైండు | 0 | 14 | 0 |
| డిటో పేపరుబైండు | 0 | 10 | 0 |
| నలచరిత్రము - అట్టబైండు. | 0 | 8 | 0 |
| ముకుందమాల - సటీకాతాత్పర్యము | 0 | 5 | 0 |
| ఆదిత్యహృదయము-సటీకాతాత్పర్యము | 0 | 3 | 0 |
| నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము | 0 | 3 | 0 |
| భజగోవింద శ్లోకములు టీకాతాత్పర్యసహితము. | 0 | 2 | 0 |
| శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము. టీకాతాత్పర్య సహితము. | 0 | 3 | 0 |
| శ్రీ సహస్రనామ స్తబకము. క్యాలికో బైండు. | 0 | 12 | 0 |
| పేపరు బైండు. | 0 | 8 | 0 |
| గోపాల సహస్రనామ స్తోత్రము | 0 | 4 | 0 |
| సప్తమస్కంధము - మూలము. | 0 | 8 | 0 |
| భోగినీ దండకము | 0 | 1 | 0 |

# రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు, బ్రాంచెస్:—గుంటూరు-రాజమండ్రి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K. వెంకట్రావు B.A, L.T., గారిచే

2 - 3 - 4 - 5 తరగతులకు

వలయువారు:—రామా అండ్ కో.,

ఏలూరు - గుంటూరు - రాజమండ్రి.